# పూజలు చేయ పూలు తెచ్చాను

దేవతలు భక్త సులభులు. భక్తితో కోరినవారి కోరికలను తీర్చేవారు. మానవుడు తన కోరికలను నెరవేర్చుకునేందుకు అనేక రకాలైన విధానాల ద్వారా ఆ దేవతలను సంతోషపరిచి, తద్వారా వారి అనుగ్రహంతో తన మనోభీష్టాలనుపొంది సంతృప్తి చెందుతాడు. కానీ...నిష్కామంగా, అంటే ఎటువంటి కోరిక లేకుండా పరమేశ్వరార్పణ భావంతో దేవతారాధన చేసే వారికి తప్పక ముక్తి లభిస్తుంది. అందువల్ల ఏ కోరికలు లేకుండా స్వచ్ఛమైన మనసుతో, మనకు తోచిన ఉపచారాలతో భగవంతుని అర్చించాలి. అటువంటి అర్చనావిధానంలో ముఖ్యమైంది పుష్పార్చన.

ఒక్కో దేవతకు ఒక్కొక్క పుష్పము ఇష్టం. ఆ పుష్పంతో పూజిస్తే వెంటనే ఫలితాన్ని పొందగలం. ఒకరికి ఇష్టమైన పుష్పం మరొకరికి నిషిద్ధం. ఏ దేవతలను ఏయే పూలతో పూజిస్తే సంతృప్తి పొంది అనుగ్రహిస్తారో తెలుసుకోవటం ఎంతైనా అవసరం.

**విఘ్నేశ్వర పూజకు:-**

ఆది పూజ్యుడైన వినాయకునికి తులసి తప్పించి మిగతా పూలన్నీ ఇష్టమైనవే. **"తులసీం వర్జయిత్వా సర్వాణ్యపి పత్ర పుష్పాణి గణపతి ప్రియాణి"** అంటోంది "ఆచార భూషణమ్". ప్రత్యేకించి దూర్వాలు (గరక), ఎర్రని పూలు సమర్పిస్తే విఘ్నేశ్వరుడు ప్రీతి చెందుతాడు. అయితే వినాయక చవితినాడు ఏకవింశతి పత్ర పూజలో మాత్రం తులసిని వాడవచ్చు.

**విష్ణు ఆరాధనకు:-**

శ్రీమహావిష్ణువుకు తులసిదళాలంటే చాలాప్రీతి. స్వర్ణ, రత్న, మణి, మాణిక్యాదులు ఎన్ని సమర్పించినా ఒక్క తులసిదళముతో సమానము కావు. తులసీదళములతో విష్ణువు సంతృప్తిని పొందుతాడు.

తులసితో పాటుగా గుంటగలిజేరు, చంద్ర, జమ్మి, గరిక, దర్భ, దమనము, మారేడు మొదలైన పత్రాలను విష్ణుపూజకు వాడవచ్చని పద్మపురాణం తెలియజేస్తోంది. ఇక పూలవిషయానికి వస్తే విష్ణుపురాణం చెప్పిన ప్రకారంగా సన్నజాజులు, మల్లెలు, అడవి మొల్లలు, గురువింద పూలు, గులాబి, గన్నేరు, దాసన, ఎర్రగోరింట, పచ్చగోరింట, సంపెంగ, దింటెన, నాగకేసరం, అడ్డసరం, జమ్మి, వేగిస, కొండగోగు మొదలైన పుష్పాలు విష్ణుపూజకు శ్రేష్ఠం.

ఇంతేగాక "విష్ణుధర్మోత్తర పురాణం" మాలతీ, మరువకం, నవమల్లిక, మధుమల్లిక, కదంబం, పాటలం, చంపకం, లవంగం, మాధవి, కేతకి, వాసంతిక, తెల్లకలువలు మొదలైన పూలు విష్ణుమూర్తికి సమర్పిస్తే ఆయన ప్రీతి చెందుతాడని వివరించింది.

జిల్లేడు, ఉమ్మెత్త, విష్ణుక్రాంతం, దిరిసెన (శిరీష), ఉత్తరేణి, వెలగ, ఎర్రకాంచనం మొదలైన వాటి పత్రాలను, పూలను విష్ణుపూజకు వినియోగించరాదని విష్ణుధర్మోత్తర పురాణంలో చెప్పబడింది.

శ్లో. **మందారమర్క దత్తూరం శాల్మలీ కాంచనారజమ్।**

**నిషిద్ధం విష్ణుపూజాయం పుష్పం వైభీతకం తథా॥** (పుష్పమాలా)

మందారం, జిల్లేడు, ఉమ్మెత్త, బూరుగు, దేవకాంచనం తాండ్రపూలతో విష్ణువును అర్చించరాదని పై శ్లోకాధారంగా తెలుస్తోంది. అదేవిధంగా శ్రీమహావిష్ణువును అక్షతలతో అర్చించరాదు.

**శివారాధనకు:-**

శివారాధనకు సమర్పించవలసిన పూలలో **"సర్వాసాం పుష్పజాతీనాం ప్రవరం నీలముత్పలమ్"** అంటూ పూల జాతులన్నింటిలోకి నల్లకలువలు శివార్చనకు అత్యంత శ్రేష్ఠమైనవిగా "వీరమిత్రోదయం" అనే గ్రంథం మనకు తెలియజేస్తోంది.

ఇక మిగతా పూల గురించి "శివతత్వ సార సంగ్రహం" అనే గ్రంథం మనకు ఈ విధంగా చెబుతోంది. గన్నేరు, జిల్లేడు, మందారం, జమ్మి, పొగడ, మోదుగ, ఇప్ప, వెంపలి, మారేడు, ఉత్తరేణి, గులాబి, అశోక, అవిసే, ఉమ్మెత్త, కొండగోగు, కడిమి, నల్లగోరింట, సురపొన్న, ఎర్రగోరింట, ఎర్రదేవకాంచనం, సంపెంగ, మల్లి, పండు గురువింద, జాజి, తుమ్మి, నూరురేకుల పద్మం, వేయి రేకులపద్మం, తెల్ల కలువ, నల్ల కలువ, మరియు తులసి మొదలైన వాటికి సంబంధించిన పుష్పాలు, పత్రాలు శివపూజకు సర్వదా శ్రేష్ఠమైనవి. వీటితో శివార్చన చేస్తే సమస్త పాపాలు తొలగి శివానుగ్రహం కలుగుతుంది.

శ్లో. **విష్ణోర్యానీహచోక్తాని పుష్పాణిచ పత్రికా:।**
**కేతకీ పుష్పమేకంతు వినా తాన్యఖిలాన్యపి।**
**శస్తాన్యేవ సురశ్రేష్ఠ శంకరారాధనాయహి॥** (నారద:)

తా. నారదుని వచనానుసారంగా విష్ణుపూజకు వినియోగించే పూలనన్నింటిని శివారాధనకు కూడా వినియోగించవచ్చు. ఒక్క మొగిలిపూవు మాత్రం శివారాధనకు పనికిరాదు.

కదంబం, బ్రహ్మమేడి, మొగిలి, దిరిసెన (శిరీష), చింత, పొగడ, వెలగ, తాడి, ప్రత్తి, బూరుగు దానిమ్మ, ఆరే, మొల్ల, అడవిమొల్ల, వేగి మరియు గుమ్మడి మొదలైన వాటి ఆకులు, పూలు శివపూజకు వాడకూడదు. ముండ్లచెట్ల ఆకులు, పూలుకూడా శివారాధనకు ఉపయోగించకూడదని "వీరమిత్రోదయం" గ్రంథమందు ఉన్నది.

**అమ్మవారి ఆరాధనకు:-**

శ్లో. **యానిపుష్పాణిచోక్తాని శంకరస్యార్చనే పురా।**
**తాని గౌర్యా: ప్రశస్తాని త్వపామార్గే విశేషత:॥** (పారిజాతం)

తా. శివపూజకు పనికివచ్చే పత్రాలు, పుష్పాలన్నీ అమ్మవారికి ప్రియమైనవే! వాటిని అమ్మవారి ఆరాధనకు వాడవచ్చు. విశేషంగా అపామార్గం అంటే ఉత్తరేణిఆకు అమ్మవారికి చాలా ప్రీతికరమైంది.

శ్లో. **నిత్యం గౌర్యా: ప్రశస్తాని రక్తపుష్పాణి సర్వదా।**
**శుక్లాన్యపిచ గౌర్యాణి గంధవంతి స్మృతానివై॥** (పారిజాతం)

తా. ఎరుపురంగు కలిగిన పూలన్నీ అమ్మవారికి ఇష్టమే! అంతేగాక చక్కని వాసన కలిగిన తెల్లనిపూలు కూడా ఆమెకు ఎంతో ప్రీతికలిగినవి.

ఇవేగాక మల్లెపూలు, జాజులు, తామరపూలు, కలువపూలు, మోదుగపూలు, అశోక, చంపక, గన్నేరు, సంపెంగ, వకుల, పున్నాగ, కొండగోగు, జమ్మి, శంఖపుష్పాలతో అమ్మవారిని అర్చించి అనుగ్రహాన్ని పొందవచ్చు.

ఇక అమ్మవారి పూజకు వాడకూడని పూలగురించి "కార్తీక మాహాత్మ్యం" **"గణేశం తులసీ పత్రం దుర్గాం నైవతు దూర్వయా"** అనిచెప్పినందున, గణేశుని తులసీ పత్రాలతో, అమ్మవారిని దూర్వాలతో పూజించరాదు. **"దేవీనామర్కమందారౌ వర్జయేత్"** అన్న శాతాతప మహర్షి వాక్యానుసారంగా జిల్లేడు, మందార

పూలు దేవిపూజకు నిషిద్ధం. ఇతర ఏ పూలు దొరకనప్పుడు ఈ రెండు పూలను వాడవచ్చు.

శ్లో. **తిలకం మాలతీ వాణస్తులసీ భృంగరాజకమ్।**
**తమాలం శివదుర్గార్థం నిషిద్ధ విహితం భవేత్॥** (భవిష్యపురాణం)

తా. నువ్వులపూలు, మాలతి, తులసి, దూర్వ, భృంగరాజము, తమాలములు ఇవి శివపూజకు మరియు అమ్మవారి ఆరాధనకు నిషిద్ధం. అయితే ఏపూలూ దొరకనట్లయితే వీటిని వాడవచ్చునని భవిష్యపురాణ వచనం.

**సూర్యారాధనకు:–**

మల్లికా, మాలతీ, దూర్వా, మాధవి, పాటల, గన్నేరు, జాజి, చామంతి, నందివర్ధనం, కొండగోగు, పచ్చగోరింట, సంపెంగ, మొల్ల, అడవిమొల్ల, పొగడ, అడ్డసరం, తామర, మోదుగ, అవిసే మొదలైన పుష్పాలతో సూర్యారాధన చేయవచ్చు. జమ్మి, గుంటగలిజేరు, నేల ఉసిరి, కృష్ణతులసి, ఎర్రచందనం, మొగిలి, కమలం వీటి ఆకులతో పూజిస్తే సూర్యభగవానుని అనుగ్రహం త్వరగా కలుగుతుంది.

గురువింద, ఉమ్మెత్త, కాంచనం, విష్ణుక్రాంతం, ముండ్లు కలిగిన చెట్లపూలు సూర్యారాధనకు పనికిరావని "వీరమిత్రోదయం" గ్రంథమందు కలదు.

**నవగ్రహములకు:–**

సూర్యునికి పచ్చగన్నేరు, చంద్రునికి కలువపూలు, అంగారకునికి దాసానిపూలు, బుధునికి సంపెంగ, గురువుకు పద్మాలు, శుక్రునికి జాజిపూలు, శనికి మల్లెలు, రాహువుకు మొల్లపూలు, కేతువుకు వివిధ పుష్పాలతో పూజిస్తే గ్రహబాధలు తొలగి ఆయాగ్రహాల అనుగ్రహాన్ని పొందవచ్చునని భవిష్యపురాణం చెబుతోంది.

**ఇతర దేవీ, దేవతలకు:–**

**"నరసింహస్య పూజాయాం నిషిద్ధం కేతకీ ద్వయమ్"** అన్న 'పుష్పమాలా' గ్రంథ వాక్యానుసారముగా నరసింహ స్వామిని కేతకీ పూలతో అర్చించరాదు.

శ్లో. **నరక్తచందనం జాతు గృహ్ణీయాద్రక్త పుష్పకమ్।**
**బిల్వపత్రైస్తత్రపసూనైర్నార్చయే ద్దేవకీ సుతమ్॥** (గౌతమి)

తా. రక్తచందన పూలతో, దానిమ్మపూలతో, ఎర్రనిపూలతో మారేడు దళాలతో శ్రీకృష్ణుని పూజింపకూడదు. వినాయకున్ని, సూర్యున్ని తెల్లజిల్లెడు పూలతో, విష్ణుమూర్తిని తులసితో, శివుని లేత మారేడు దళాలతో,మహాలక్ష్మిని తామరపూలతో, ఆరాధిస్తే శీఘ్రముగా వారి అనుగ్రహాన్ని పొందవచ్చు. అదేవిధంగా గాయత్రిదేవిని మల్లిక, అవిసే, పొగడ, మందార, జిల్లేడు, కదంబ, చంపక, పున్నాగ, దర్భపూలగుత్తులతో పూజించటం శుభప్రదం. శ్రీచక్రాన్ని తామరపూలు, కలువలు, జాజి, మల్లె, చంపక పూష్పాలతో పూజించినచో పరదేవత కృపను పొందవచ్చు.

సామాన్యముగా నిత్యపూజకు ఎర్రగన్నేరు, పారిజాతాలు, మాలతి, కనకాంబరాలు, నీలాంబరాలు, మందారం, నందివర్ధనం, చామంతి, జాజి, కలువపూలను వాడవచ్చు.

చివరగా కాలాన్ని, ప్రదేశాన్నిబట్టి అన్ని పూలు అన్నివేలలా దొరకకపోవచ్చు. కాబట్టి **"విహిత ప్రతిషిద్ధైస్తు విహితా లాభతో2ర్చయేత్"** అన్న 'తత్త్వసాగర సంహిత' గ్రంథానుసారంగా అన్నిరకాల పూలతో పూజించవచ్చు. లేదా చక్కని రంగు, వాసన కలిగిన ఏ పూలనైనా భగవంతుని సేవకు ఉపయోగించవచ్చు.

అత్యంత శుద్ధమైన ప్రేమ కలిగిన మనసుతో పత్రం, పుష్పం, ఫలం, జలం ఏది సమర్పించినా సరే..... ఎంతోప్రీతితో స్వీకరిస్తానన్న గీతాకారుని వాక్యాన్ననుసరించి ఏదో ఒకరకంగా భగవంతుని అర్చించడమే ముఖ్యం.

---



---


వ్యాసరచన

**అప్పాల శ్యామప్రణీత్ శర్మ అవధాని**

వేదపండితులు

గ్రా. అచ్చులాపూర్, మం. తాండూర్,

జి. మంచిర్యాల, పిన్:504273

సెల్: 9440951366